గీ. వేళ గా దిది ఘోమ్ము మాశూలపాణి, కేళిలో నున్నవాఁ డని కినువడంగ
భృగువు శాంతి వహించి యనేకదినము, లచ్చటనె వేచికొనియుండి హరునికొఱకు.
సీ. సర్వజ్ఞుఁ డయ్యును శర్వుఁ డజ్ఞుఁడువోలె, నంగనాసంగలౌల్యమునఁ జిక్కి
తనగతి యేమియుఁ గనుఁగొన కునికి లో, నావిర్భవింపంగ నాగ్రహంబు
యోనిలింగాకార మొందంగ శంభునిఁ, దిట్టి నందిని జూచి తీవ్రముగను
శైవుల కెల్లఁ బాషండత్వ మొదవఁగ, శాపంబు నొసఁగి తత్క్షణమునంద
గీ. బ్రహ్మలోకంబునకుఁ బోయి బ్రహ్మ కెఱఁగి, నిలువఁబడ ధాత యేమియుఁ బలుకఁడయ్యె
దాని కవమానిని కోపించి ధాత కెందు, నర్చనము లేకపోవుఁగా కని శపించి. 3263
సీ. విష్ణులోకమునకు వెంటనె చని శార్ఙ్గి, మందిరద్వారంబులందుఁ దన్ను
వారింప కునికి నెవ్వరును గోవిందుని, యంతఃపురంబునయందుఁ జొచ్చి
పద్మ యొత్తుచు నుండఁ బదములు శయ్యపైఁ, బవళించియున్నమాధవునిఁ జూచి
దరి కేఁగి బిరబిరఁ దదురఃప్రదేశంబు, నెడమపాదంబున నెగసి తన్నె
గీ. నపుడు సంభ్రమమున లేచి యచ్యుతుండు, పట్టికొని యొత్తుచుఁ దదంఘ్రిపద్మములను
స్వామి ధన్యుఁడ నైతిఁ దావకపదాబ్జ, రేణువులు సోఁకుటను మచ్ఛరీరమందు. 3264
గీ. వివిధసంపదవాప్తిహేతువు లపార
భవజలధిసేతువులు విప్రపాదపద్మ
పాంసువులు వేనిమేనను బడునో వాని
తనువునం దుండుఁ బుణ్యతీర్థంబు లెల్ల. 3265
క. అని పలికి స్వర్ణకలశం, బునను మహాలక్ష్మి జలముఁ బోయుచు నుండం
గను గడిగి తత్పదంబులు, తనశిరమునఁ జల్లుకొనియెఁ దజ్జలకణముల్. 3266
గీ. అది గనుంగొని భృగువు హర్షాశ్రుపూర్ణ, లోచనుం డయి పంకజలోచనునకు
వందన మొనర్చి శుద్ధసత్త్వప్రధాన, మయినతద్గుణమునకు విస్మయము నొంది. 3267
గీ. ఔర రూపంబు విజ్ఞాన మౌర శాంతి, యౌర క్షమ యౌర కారుణ్య మౌర శుద్ధ
సత్త్వగుణ మౌర కలదె యీశక్తి ముజ్జ, గంబులం దెందు నేని యొక్కనికి నైన.
సీ. అని మెచ్చుకొని పంకజాక్షునిగుణముల, నంతరంగమున నత్యద్భుతముగఁ
దిలకించి శార్ఙ్గిని దేవాదిదేవ నీ, వంటిదేవుఁడు లేఁడు వాస్తవముగ
బ్రహ్మణ్యుఁడవు నీవు పరమాత్ముఁడవు నీవు, సర్వలోకావనక్షముఁడ వీవు
సర్వజ్ఞుఁడవు నీవు సర్వశక్తివి నీవు, సర్వబృందారకస్వామి వీవు
గీ. సత్త్వమూర్తివి నీవు నీసత్త్వ మెఱుఁగఁ
దలఁచి యపచారమును నేను జలిపినాఁడఁ
దప్పు సైఁపు మ టంచుఁ దత్పదములందు
భక్తిభరితాంతరంగుఁడై పడియె హాని. 3268

గీ. అప్పు డాదరమేదురస్వాంతుఁ డగుచు, భృగుమహర్షిని లేవంగ నెత్తి శౌరి
ఋషివతంసమ నీయం దొకింత యేని, నేర మనునది లే దని యూరడించె. 3270

వ. అంతట భృగుమహాముని వాసుదేవానుమతిం గైకొని మందరపర్వతంబున కరుదెంచి మహర్షిజనసభామధ్యంబునం జేరి తపోధనపూజితుం డై యి ట్లనియె. 3271

గీ. శంకరుఁడు తామసుండు రాజసుఁడు బ్రహ్మ, సాత్త్వికుఁడు వాసుదేవుఁడు సత్యముగను
జని త్రిమూర్తులకడకు నే ననుభవించి, తెలిసికొనినట్టివిషయంబుఁ దెలిపినాఁడ. 3272

వ. తామసుం డైనరుద్రుండు మచ్ఛాపంబున యోనిలింగాకారముం జెందె. తద్భక్తు లగుశైవు లెల్లరును బాషండు లై భస్మలింగాస్థిధారణంబుం జేయుచు వేదబాహ్యమతంబుల నవలంబించిరి. రాజసుం డైనబ్రహ్మ మచ్ఛాపంబుచేతన జగంబులందుఁ బూజానర్హుం డయ్యె. సాత్త్వికమూర్తి యగునారాయణుం డొక్కఁడ మత్పూజ్యత్వముం బడసె నని చెప్పుటయు మనువును దపోధనులును సంశయరాహిత్యముం జెంది సాత్త్వికమూర్తి యగువాసుదేవుని నొక్కనినె పరదైవంబుగా నిశ్చయించి విష్ణునైవేద్యతీర్థనిర్మాల్యాదు లన్నియును గ్రాహ్యంబు లనియును మహేశ్వరున కర్పితము లైనవస్తువు లగ్రాహ్యంబు లనియును సిద్ధాంతీకరించి మాధవారాధనంబు గావింపం దొడంగిరి. 3273

క. కావున జనవల్లభ నీ, భావంబునఁ గోర్కి పరమపద మొందంగా
నావిర్భవించు నెడఁ బర, దైవం బగుహరిని గొలిచి ధన్యుఁడ వగుమా. 3274

క. అని నుడువుటయు దిలీపుఁడు, మనమున సంతసము నొంది మాధవుసేవన్
బొనరించుచుఁ గాంచి యిహం, బున సౌఖ్యము లెల్లఁ దుదను మోక్షము నొందెన్.

క. ఇది పద్మోత్తరఖండము, విదితం బొనరించినాఁడ విశదము గాఁగన్
దుదిది యగుటఁ బాద్మమునకు, గుదిగ్రువ్వంబడియె నిందు గోప్యము లెల్లన్. 3276

—: పద్మపురాణపఠనశ్రవణాదిఫలకథనము :—

సీ. సాత్త్వికంబును వేదసమ్మితంబును నైన, యీపురాణము నిల నెవ్వ రేని
వినినఁ బఠించిన వినిపించినఁ బాత్రు లై, హరికృపాపూర్ణకటాక్షములకు
ననుభవించి యిహంబునందు సౌఖ్యము లెల్ల, నపవర్గ మొందుదు రంతమందు
శ్రవణర్క్షపూర్ణిమాగ్రహణకాలములందు, ద్వాదశియం దమావాస్యయందుఁ

గీ. గాని దినదినంబునఁ గాని దీన నర్ధ, పద్యమో పాదపద్యమో భక్తిఁ జదువ
నశ్వమేధసహస్రంబు నాచరించి, నట్టిఫల మొందుదురు సంశయంబు లేదు. 3277

క. కనకకలశసముపేతము, గను బద్మపురాణపుస్తకమును సమర్పిం
చినఁ బౌరాణికుఁ డగువి, ప్రున కెపుడును దాత విష్ణుపురమున నుండున్. 3278

వ. అని వచియించుటయు శౌనకాదిమహామునులు పరమానందముం జెంది సూతున కుచితసత్కారంబు గావించి యథేచ్ఛంబుగం జనిరి. 3279

క. శ్రీనాథహృదయ హృదయ, శ్రీనాథ ముఖార్యభిన్న చిన్మయరూపా
యానందకాననాథ, శానా శ్రీవిశ్వనాథ సద్గురునాథా. 3280

క. స్మరహార కాశివిశ్వే, శ్వర సంసారవ్యథానివారణనిపుణా
హరివిధిమహేంద్రముఖని, ర్జరకోటికిరీటరత్నరంజితచరణా. 3281

—: వాణీవృత్తము :—

శమధనహృన్నివాస బుధసన్నుతప్రభావా
కమలజముఖ్యనిర్జరనికాయదుర్లభాత్మా
సుమశరగర్వనిర్మథనశూర యాశ్రితాప
త్తిమిరవిభేదచండకర దేవ విశ్వనాథా. 3282

గద్యము

శ్రీమచ్చిదంబరకవీంద్రప్రణీతం బైన
శ్రీ మ దాం ధ్ర ప ద్మ పు రా ణ ం బు న
నుత్తరఖండంబు సర్వంబును
సంపూర్ణంబు.

శ్రీ కా శీ వి శ్వే శ్వ రా ర్ప ణ మ స్తు.





# శతావధాని శ్రీ పిసుపాటి చిదంబరశాస్త్రికృతగ్రంథములు

| | | | |
|---|---|---|---|
| 1. శ్రీమదాంధ్రపద్మపురాణము | (ప్రథమసంపుటము) | క్యాలికోబైండు | 8–0–0 |
| ,, ,, | (ద్వితీయసంపుటము) | ,, | 4–0–0 |
| ,, ,, | (తృతీయసంపుటము) | ,, | 5–0–0 |
| ,, ,, | (చతుర్థసంపుటము) | ,, | 6–0–0 |

2. హైమవతీవిలాసము (ప్రబంధము) 0–8–0
3 కపోతకిరాతము (ప్రబంధము) 0–6–0
4. శ్రీరామాంజనేయము (నాటకము) 1–0–0
5. శ్రీకృష్ణసందేశము (నాటకము) 0–12–0
6. భారతీయప్రబోధము (నేటిపరిస్థితుల విమర్శించు కావ్యము) 0–6–0
7. పీఠికాపురశతావధానము 0–4–0
8. నబాబుపేటశతావధానము 0–4–0
9. బెజవాడ శతావధానము 0–4–0
10. రాజసభావిహారము (అచ్చు కానున్నది)
11. పంచాయతనపంచశతి (సంస్కృతము) 1–0–0
12. అవధానాదర్శము (సంస్కృతము) 0–2–0
పి. సుబ్రహ్మణ్యశాస్త్రికృతభావబోధినీవ్యాఖ్యానమలంకృతము
13. రాజధర్మకావ్యము (సంస్కృతము - అచ్చుకానున్నది)
విద్వాన్ పి. విశ్వేశ్వరశాస్త్రికృతజయవ్యాఖ్యానమలంకృతము

## పిసుపాటి సుబ్రహ్మణ్యశాస్త్రికృతులు

14. శంకరవిజయము (గద్యము) 1–8–0
15. త్యాగరాజనాటకము (అముద్రితము)
16. మాయావిలాసము (ప్రబంధము - అముద్రితము)

## విద్వాన్ పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రికృతులు

17. శ్రీరత్నపాంచాలిక (శ్రీసర్వజ్ఞసింగభూపాలునిసంస్కృతకృతి కాంధ్రీకృతి) 1–8–0
18. దూతవాక్యము (అచ్చుకానున్నది - భాసకృతి కాంధ్రీకృతి)
19. ప్రద్యుమ్నాభ్యుదయము ,, (శ్రీరవివర్మభూపాలునిసంస్కృతకృతి కాంధ్రీకృతి)

వ్యాకరణవిద్యాప్రవీణ, ఉభయభాషాప్రవీణ, సాహిత్యాలంకార

## పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రికృతులు

20. పాణినీయము–కావ్యవాఙ్మయము 1–8–0
21. ఆంధ్రవాఙ్మయవిమర్శము 0–6–0

ప్రాప్తిస్థానము
శ్రీ చిదంబరగ్రంథమాల
రామారావుపేట
కాకినాడ

ప్రాప్తిస్థానము
విద్వాన్ పి. విశ్వేశ్వరశాస్త్రి
ఆంధ్రాధ్యాపకుడు వి. ఆర్. కాలేజి
నెల్లూరు